

అనగా అనగా కట్టెలు కొట్టే
ఒక ముసలివాడి దగ్గర
ఒక పిల్లవాడు ఉండేవాడు.

ఒక రోజు కట్టెలు కొట్టే ముసలివాడు
పిల్లవాడితో ఇలా అన్నాడు,
"నేను చాలా దూరం వెళ్లాలి. బహుశా, మనం
మళ్లీ కలుసుకోక పోవచ్చు."





"నన్ను కూడా నీతో తీసుకుని వెళ్లు,"
పిల్లవాడు అన్నాడు.

"నాతో పాటు నిన్ను తీసుకుని వెళ్లలేను," కట్టెలు
కొట్టే ముసలివాడు చెప్పాడు.
"కానీ, నీకు నేను మూడు వస్తువులు ఇస్తాను.
వాటితో నీకు కలిసి వస్తుంది."

పిల్లవాడికి ముసలివాడు ఒక
పాత గొడ్డలి ఇచ్చాడు,



ఒక పాత ఫిడేలు ఇచ్చాడు,





ఒంటి కన్ను పిల్లిని ఇచ్చాడు.



తరవాత కట్టెలు కొట్టేవాడు
వెళ్లిపోయాడు.



"వీటితో నేను ఏం చెయ్యాలి?"
పిల్లవాడు అనుకున్నాడు.
"ఒక పాత గొడ్డలి, ఒక పాత
ఫిడేలు, ఒంటి కన్ను పిల్లితో
ఎవరైనా ఏం చేస్తారు? వీటిని
ఇక్కడే వదిలి పెట్టేసి పోతాను."



"నీకు తెలిసింది చాలా తక్కువ,"
పిల్లి అంది.
"కొంచెం తెలుసుకున్నావు కాబట్టి,
త్వరలోనే చాలా కొత్త విషయాలు
తెలుసుకుంటావు. పద, వెళదాం!"



"నేను కూడా నీతో వస్తాను," పిల్లి అంది.

"నువ్వు మాట్లాడగలవని నాకు తెలియదు,"
పిల్లవాడు అన్నాడు.



పిల్లవాడు గొడ్డలి తీసుకున్నాడు.



పిల్లి ఫిడేలు తీసుకుంది.



ఇద్దరూ కలిసి బయలుదేరారు.



అలా నడుస్తూ, నడుస్తూ వెళ్లారు.

“నాకు ఆకలి వేస్తోంది,” పిల్లవాడు అన్నాడు.



“నాకు కూడా ఆకలి వేస్తోంది,” పిల్లి అంది.





"ఒంటి కన్ను పిల్లి ఫిడేలు వాయిస్తుంటే
వినాలని ఎవరు అనుకుంటారు?"
పిల్లవాడు అన్నాడు.

"నువ్వే చూద్దువుగాని," అంది పిల్లి.
తరవాత పిల్లవాడు, పిల్లి నిద్రపోయారు.

"తినటానికి నా దగ్గర ఏమీ లేదు,"
పిల్లవాడు చెప్పాడు.
"అయితే నిద్ర పోదాం," పిల్లి అంది.
"రేపు నేను ఫిడేలు వాయిస్తాను. మనం
తినటానికి తప్పకుండా ఏమైనా
దొరుకుతుంది."



మరునాడు ఇద్దరూ మళ్లీ

బయలుదేరారు.

"చూడు!" పిల్లి అంది.

"భలే!" అన్నాడు పిల్లవాడు.

"ఎంత ఆహారం ఉందో చూడు!

వీళ్లంతా పిక్‌నిక్‌కి వచ్చినట్టున్నారు!"





పిల్లవాడు, పిల్లి పరిగెత్తుకుంటా అక్కడికి వెళ్లారు. “మాకు బాగా ఆకలిగా ఉంది,” పిల్లవాడు అన్నాడు.

“తినటానికి మాకు ఏమన్నా ఇవ్వండి,” పిల్లి అంది.





“ఇక్కడి నుంచి పోండి!” అంటూ ఒకతను అరిచాడు.

“దయచేసి మాకు ఏమన్నా పెట్టండి,” పిల్లవాడు బతిమలాడాడు.

“తరవాత మీ మనోల్లాసానికి ఈ పిల్లి ఫిడేలు వాయిస్తుంది.”

“ఒంటి కన్ను పిల్లి ఫిడేలు

వాయిస్తుంటే ఎవరు వింటారు?”

అతను అన్నాడు.

“ఇక్కడినుంచి పొండి!”



“నా ఫిడేలుని తప్పక వాయిస్తాను.”

పిల్లి అంది.

అలా అంటూ ఫిడేలు వాయించటం

మొదలుపెట్టింది.





పిల్లి ఫిడేలు వాయించటం మొదలు పెట్టగానే అక్కడి వాళ్లు నాట్యం చెయ్యటం మొదలు పెట్టారు. వాళ్లు నాట్యం చెయ్యకుండా ఉండ లేకపోయారు.  అది ఒక మాయా ఫిడేలు కావటంతో వాళ్లు అలా నాట్యం చేస్తూనే ఉండిపోయారు.



మగవాళ్లు ఆడారు!
ఆడవాళ్లు ఆడారు!
పిల్లలందరూ ఆడారు!

ఆవులన్నీ ఆడాయి.
పందులన్నీ ఆడాయి.
అవి ఆడకుండా ఉండ లేకపోయాయి.

బల్ల నాట్యం చెయ్యసాగింది.
పాత్రలు నాట్యం చెయ్యసాగాయి.
పళ్లాలు కూడా నాట్యం చేశాయి.



"ఫిడేలు ఆపు!  ఆగు!"  అంటూ వాళ్లు అరిచారు. కానీ, పిల్లి ఫిడేలు వాయిస్తూనే ఉంది. అక్కడివాళ్లు నాట్యం చేస్తూనే ఉన్నారు. అలా నాట్యం చేస్తూ చేస్తూ వాళ్లు కింద పడిపోయారు.



"పద," పిల్లవాడితో పిల్లి అంది, "ఇప్పుడు వెళ్లి తిందాం." పిల్లవాడు, పిల్లి తింటూ ఉన్నారు, తింటూ ఉన్నారు. చివరికి ఇక ఒక్క మెతుకు కూడా తినలేనంత నిండుగా తిన్నారు.





"నీ ఫిడేలు విని ప్రజలు నాట్యం చేస్తారని నాకు తెలియదు," పిల్లవాడు అన్నాడు.

"నీకు తెలిసింది చాలా తక్కువ," పిల్లి అంది. "కొంచెం తెలుసుకున్నావు కాబట్టి, త్వరలోనే చాలా కొత్త విషయాలు తెలుసుకుంటావు. పద, వెళదాం!"



తరవాత పిల్లవాడు, పిల్లి ముందుకు సాగిపోయారు.

దారిలో వాళ్లకి ఒక రాజు ఎదురయ్యాడు.

"పరిగెత్తండి!" రాజు అరిచాడు.

"మీ ప్రాణాలు కాపాడుకోటానికి పరిగెత్తండి!"

"భయంకరమైన రాకాసి బల్లి (డ్రాగన్)

ఒకటి వస్తోంది," రాజు చెప్పాడు.

"పరిగెత్తండి! పరిగెత్తండి!"



"ఎందుకు?"

పిల్లవాడు అడిగాడు.





“రాకాసి బల్లిని మేం చంపేస్తే మీరు

మాకు ఏమి ఇస్తారు?” పిల్లి అడిగింది.

“బంగారు నాణాలతో మూడు సంచులు

ఇస్తాను,” రాజు చెప్పాడు.

రాజు పరిగెత్తుకుంటూ వెళ్లి తన

మహలులో దాక్కున్నాడు.



“రాకాసి బల్లి
వస్తోంది!”
పిల్లి అరిచింది.
“తొందరగా చెట్టు
ఎక్కు!”



దమ్ము తీసుకోటానికి రాకాసి
బల్లి ఆగింది. సరిగ్గా వాళ్లు ఉన్న
చెట్టు కిందే ఆగింది.



"భలే!" పిల్లవాడు అన్నాడు.
"ఆ రాకాసి బల్లులను చూడు!"

"అది ఒక్క రాకాసి బల్లే,"
పిల్లి చెప్పింది.
"దానికి మూడు తలలు ఉన్నాయి."

"నేను ఏం చెయ్యాలి?"
పిల్లవాడు అడిగాడు.
"దాని తల ఒకటి నరికెయ్యనా?"

"అప్పుడు అది రెండవ తలతో
నిన్ను తినేస్తుంది, మూడవ
తలతో నన్ను తినేస్తుంది!"



కొంచెం సేపటికి రాకాసి బల్లి ఒక కన్ను నిద్రపోయింది. తరవాత రెండవ కన్ను నిద్రపోయింది, మూడవ కన్ను కూడా నిద్రపోయింది. మెల్లమెల్లగా దాని ఆరు కళ్లూ నిద్రపోయాయి.



“ఇప్పుడు నా ఫిడేలు వాయిస్తాను,” పిల్లి చెప్పింది.
“మధురమైన రాగం వాయిస్తాను. దాంతో రాకాసి బల్లి మూడు తలలూ నిద్రపోతాయి.”

అలా అంటూ ఫిడేలు వాయించటం మొదలు పెట్టింది పిల్లి. ఎంతో మధురమైన రాగం వాయించసాగింది.



"నేను ఫిడేలు వాయిస్తున్నంత సేపు అది
గాఢ నిద్రలో ఉంటుంది. ఇప్పుడు నువ్వు వెళ్లి
దాని మూడు తలలూ కోసెయ్యి."



రాకాసి బల్లి అక్కడే పడుకుంది.
అది గాఢ నిద్రలోకి వెళ్లిపోయింది.

అప్పుడు ఆ పిల్లవాడు తన పాత గొడ్డలి తీసుకుని
ఒక్క వేటుతో దాని మొదటి తల నరికి వేశాడు!
రెండవ వేటుకి రెండవ తల నరికి వేశాడు!
మూడవ వేటుకి మూడవ తల నరికి వేశాడు!
దాంతో రాకాసి బల్లి చచ్చి పోయింది.





“నీ ఫిడేలు విని ప్రజలు నాట్యం చేసి పడిపోతారని నాకు తెలుసు,” పిల్లవాడు అన్నాడు. “కానీ, నీ ఫిడేలుతో రాకాసి బల్లి కూడా నిద్ర పోతుందని నాకు తెలియదు.”

“నీకు తెలిసింది చాలా తక్కువ,” పిల్లి అంది. “కొంచెం తెలుసుకున్నావు కాబట్టి, త్వరలోనే చాలా కొత్త విషయాలు తెలుసుకుంటావు. పద, వెళదాం!”





తరవాత పిల్లవాడు, పిల్లి రాజు దగ్గరకు బయలుదేరారు.
"మేం రాకాసి బల్లిని చంపేశాం," పిల్లవాడు చెప్పాడు.



"మీరు ఇస్తామన్న మూడు సంచుల బంగారు నాణాలు ఇవ్వండి," పిల్లి అడిగింది.

"సంచులు ఏమిటి?" రాజు అన్నాడు. "బంగారు నాణాలు ఏమిటి?"

"రాకాసి బల్లిని చంపితే మూడు
సంచుల బంగారు నాణాలు ఇస్తానని
మీరు మాట ఇచ్చారు!"
పిల్లవాడు చెప్పాడు.



"మీరు ఇక్కడి నుంచి వెళ్లిపోండి. లేకపోతే మిమ్మల్ని
చెరసాలలో పెట్టిస్తాను," రాజు అన్నాడు.
"కారాగార అధికారిని ఇప్పుడే పిలిపిస్తాను."



కారాగార అధికారిని రాజు పిలిపించాడు.
“ఈ పిల్లవాడిని, పిల్లిని తీసుకుని వెళ్లి
చెరసాలలో వెయ్యి!”



“కానీ...” పిల్లవాడు ఏదో చెప్పబోయాడు.

మరునాడు కారాగార అధికారి వచ్చాడు.
పిల్లవాడు, పిల్లి కోసం కొన్ని రొట్టెలు, నీళ్లు
తెచ్చాడు.
"ఇంతకు మించి మీకు ఏమీ దొరకదు,"
అతడు చెప్పాడు.





"ఇప్పుడు మనకి ఎవరు సహాయం చేస్తారు,"
పిల్లవాడు అన్నాడు.

"నేను సహాయం చేస్తాను," పిల్లి అంది.
"ఫిడేలుతో నీకు సహాయం చేస్తాను. నువ్వు
చూస్తూ ఉండు."



“వద్దు! వద్దు!” కారాగార అధికారి అన్నాడు.
“ఒంటి కన్ను పిల్లి వాయించే ఫిడేలు వినాలన్న కోరిక నాకు ఎంతమాత్రం లేదు.”



“చాలా చాలా ధన్యవాదాలు!” పిల్లవాడు అన్నాడు.
“ఇప్పుడు మీ కోసం నా పిల్లి ఫిడేలు వాయిస్తుంది.”

"అయినా నేను ఫిడేలు వాయిస్తాను,"

అంది పిల్లి.

అలా అంటూ ఫిడేలు వాయించటం

మొదలు పెట్టింది.





ఫిడేలు మీద పిల్లి ఒక విషాద

రాగాన్ని వినిపించసాగింది. అది విని

కారాగార అధికారి ఏడవటం మొదలు

పెట్టాడు.

కారాగార అధికారి ఏడుస్తూనే ఉన్నాడు.
అది మాయా ఫిడేలు కావటంతో అతడు
ఏడుపు ఆపలేకపోయాడు.





ఫిడేలును పిల్లి వాయిస్తూనే ఉంది.
పాపం, కారాగార అధికారి అక్కడే
కూర్చుని ఏడుస్తూనే ఉన్నాడు.





పిల్లవాడు, పిల్లి చెరసాల నుంచి
బయటకు వచ్చారు.

అప్పుడు పిల్లవాడు తాళాల గుత్తిని
అందుకున్నాడు.



పిల్లవాడు, పిల్లి ముందుకు సాగిపోయారు. జీవితాంతం వాళ్లు ఇద్దరూ స్నేహితులుగా ఉండిపోయారు.



అయిపోయింది.